# వెలుగు వచ్చేవేళ

## (కవితా సంపుటి)

రచన

డా॥ వాసా ప్రభావతి

హైదరాబాదు

వాసా ప్రచురణలు

మలక్ పేట - హైదరాబాదు

# VELUGU VACHEY VELA

by

Dr VASA PRABHAVATI

First Edition - August 1992

వెల : రూ. 25/-

ముఖచిత్రం : శీలా వీర్రాజుగారు

ప్రతులకు :
ఎ. వి. మాధవి
వాసా నిలయం
11/2RT. మునిసిపల్ కాలనీ,
మలక్ పేట, హైదరాబాదు- 500036.

విశాలాంధ్రా బుక్ హౌస్
విజ్ఞానభవన్
బ్యాంక్‌స్ట్రీట్, కోఠి హైదరాబాదు.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్ - హైదరాబాదు.

నవోదయ బుక్‌హౌస్ (ఆర్య సమాజ మందిరమునకు ఎదురుగా)
సుల్తాన్‌బజార్, హైదరాబాదు

ముద్రణ
శబరి ప్రింటర్స్
బాగ్ లింగంపల్లి - హైదరాబాదు

# అంకితం

ప్రముఖ సాహితీ మూర్తులు -
భారత స్వాతంత్ర్య సమర యోధులు -
ఆంధ్ర సాహిత్య పోషకులు -
ఆంధ్ర సారస్వత పరిషత్తు రథ సారథులు -
సహృదయులు అయిన
శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి
కళాభి వందనములతో
ఈ కవితా సంపుటిని
అంకితం చేస్తున్నాను.

— కవయిత్రి

# కృతజ్ఞతలు

ఎందరో మహాకవులు అందరికి నా వందనాలు. నా కవితలను ప్రసారం చేసిన ఆకాశవాణి, దూరదర్శన్‌ల, వారికి ప్రచురించిన పత్రికల వారికి నా కృతజ్ఞతలు.

నా కవితలు చదివి కవితా సంపుటిగా వెలువడుటకునన్ను ప్రోత్స హించిన నా శ్రేయోభిలాషులకు అడగగానే నా మిత్రులకు నా నమస్కారాలు

ఇందలి కవితలు చద్వివి అభినందన అందజేసిన మా గురువర్యులు జ్ఞాన పీఠ యవార్డు గ్రహీతలు తెలుగు యూనివర్సిటీ ఉపాధ్యాక్షులు ఆచార్య సి. నారాయణ రెడ్డిగారికి,

ప్రముఖ విమర్శకులు, సాహితీమూర్తులు కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగుశాఖ ఆచార్యులు ప్రొఫెసర్ పేర్వారం జగన్నాథంగారికి, నా హృదయ పూర్వక వందనములు

నామాట మన్నించి నా మీద అభిమానంతో ఈ కవితా సంపుటిని అంకితం తీసుకోడానికి అంగీకరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, నా అభివందములు.

ముఖచిత్రాన్ని అందంగా చిత్రించి యివ్వడమే కాక ఈ గ్రంథం వెలువడుటకు సహకరించిన ప్రముఖ చిత్రకారులు, సాహితీ బంధువులు శ్రీ శీలా వీర్రాజుగారికి

నా కవితలను, నా రచనలను ప్రోత్సహించే సాహితీ చైతన్యమూర్తి శ్రీ పోతుకూచి సాంబశివరావుగారికి నా నమస్కారాలు

కవరు పేజీని ప్రింటుచేసి యిచ్చిన బాలాజీ ప్రింటర్స్ చిక్కడపల్లి వారికి, సకాలంలో ప్రింటుచేసి యిచ్చిన శబరి ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

కవయిత్రి—

Grams "TELVERS"

Phones : Off : 234815
: 236911
Res : 248451

# తెలుగు విశ్వవిద్యాలయం

# TELUGU UNIVERSITY

**Prof. C NARAYANA REDDY**
M A. Phd , D Litt
VICE-CHANCELLOR

Lalitha Kala Kshetram
Public Gardens
HYDERABAD-500 004.
Andhra Pradesh

Date : 8-6-1992

## అభినందన

'తమసోమా జ్యోతిర్గమయ'. ఎంతమంచి ఆకాంక్ష ఇది. అర్షమైనా, అత్యాధునిక పార్శ్వమైనా, అందరూ కోరుకునే సదాశయం చీకటినుంచి వెలుగులోకి.

డా॥ ప్రభావతి కవితా సంపుటి పేరులోనే ఆ ముద్ర స్పష్టంగావుంది. చాలా కవితల్లో చీకటిపోవాలని, వెలుతురు రావాలని, చెడును నిర్మూలించాలని, అడుగడుగునా అగుపిస్తుంటుంది. అభిప్రాయాలను సూటిగా, నిరాడంబరంగా చెప్పేధోరణి ఈ కవయిత్రిది. 'తేడా' అనే చిన్న కవితలో ఈ అంశం స్పష్టమవుతుంది.

"మేఘం నల్లబడితే
వర్షించి పుడమి తల్లిని
పులకింప చేస్తుంది.
మనిషి మనసు నల్లబడితే
తోటి మనసును నలిపి
పుడమిపై అలజడి రేపుతుంది."

అదే నలుపు. కాని గుణం వేరు. మేఘం నలుపు పచ్చదనానికి హేతువవుతుంది. మనసు నలుపు కల్లోలానికి కారణమవుతుంది.

చక్కని భావాలతో సరళ కవితలను రచించిన డా॥ వాసా ప్రభావతికి నా హార్దిక అభినందన.

సి. నారాయణరెడ్డి

Prof. Pervaram Jagannadham
Chairman
Board of Studies in Telugu
Kakatiya Universits
Vidvaranyapuri
WARANGAL - 506 009.

# అభినందన

ఈ రోజుల్లో రాశిలోనూ వాసిలోనూ ఏమాత్రం కొదువ లేకుండా ఆధునిక తెలుగు కవిత్వం విరివిగాని వస్తున్నది. యువకవులెందరో చక్కని చిక్కని కవితా సంపుటాల్ని వెలువరిస్తున్నారు. వస్తు వైవిధ్యంలోనే కాక అభివ్యక్తిలోనూ శిల్పంలోనూ కవులు తమదైన వ్యక్తిత్వాన్ని నిలుపు కుంటున్నారు. ఊహాశాలీనతను ప్రదర్శిస్తున్నారు. అనుభూతులకు మాటల దుస్తులు తొడిగి కళాత్మకతతో ప్రాణంపోసి కవితాజగత్తులోకి పంపుతున్నారు. అన్నింటికన్న మించి ఆధునిక భావచేతన వీటిలో పుష్కలంగానే ఉంటున్నది. ప్రతిభావంతులైన కవయిత్రులు కూడా ఈ కాలంలోనే ఎక్కువగా ఉన్నారు. ఇది హర్షించదగిన విషయం, సాహిత్యానికి ఆరోగ్యకరమైన అంశం.

ఆరోగ్యకరమైందని ఎందుకన్నానంటే, కొన్నాళ్ళక్రితం — అరవైల నుండి డెబ్బైలదాకా కవిత్వం పేరుతో వచ్చిన అచ్చుకాగితాలు సాహిత్య కళను ధ్వంసం చేసినాయి, కవిత్వాన్ని వికృత పరచినాయి. వీటి సృష్టి కర్తలు జానపద చలన చిత్రాల్లో కనిపించే భూతప్రేత పిశాచాల్లా కవితా రంగాన్ని బీభత్సం చేసినారు. మళ్ళీ సాహిత్య స్థితిని పునరుద్ధరించుకోవడానికి మనకు సుమారు పది సంవత్సరాలకాలం పట్టింది. వీళ్ల చేసిన హల్లగొల్లా, ఆర్భాటాలు ఇంతా అంతాకాదు. వీళ్ళు కలిపించిన భ్రమలు తొలగి యువ కవులు అసలైన సిసలైన కవిత్వం వైపు మళ్ళినారు. మళ్ళీవారు అచ్చమైన కవిత్వాన్ని ఆవిష్కరిస్తున్నారు. ఇది ఆనందదాయకం. అభినందనీయం.

ఐతే కవిత్వం వైయక్తిక ఆరాధన వస్తువుగా మారడం, లోలోతుల్లో సుడులు తిరిగే అనుభూతుల్ని ఎవరికీ అర్థంకాకుండా సరియైన ఆకారం ఒలిపించకుండా ఆవిష్కృతం కావడం ఈనాటి ఫేషన్ అయిపోయింది. దీన్ని పరిహరించడం ఎంతో అవసరం.

ఇప్పుడు వస్తున్న ఆధునిక తెలుగు కవిత్వాన్ని స్థూలంగా ఐదు రకాలుగా విభజించవచ్చు, అవి —

1. అనుభూతివాద ధోరణి
2. తాత్త్విక ధోరణి
3. అధ్యాత్మిక ధోరణి
4. నవ్య సంప్రదాయవాద ధోరణి
5. మానవ వికాసవాద ధోరణి

సోదరి డా॥ సావా ప్రభావతిగారి "వెలుగు వచ్చేవేళ" అనే ఈ కవితా సంపుటి ప్రధానంగా మానవ వికాసవాద ధోరణిలోకి చేరుతుంది. ఐతే ఈ వింగడింపును చేసేటప్పుడు ఒక విషయాన్ని గమనించాలి. ఏదైనా ఒక కవి రచనలో కేవలం ఒకే ఒక్క ధోరణి మాత్రమే ఉంటుందని చెప్పలేం. అందులో ఒక ధోరణి ప్రబలంగా ఉండి, మిగతా ధోరణుల ఛాయలుకూడ అక్కడక్కడా కనిపించవచ్చు. కనిపించకపోనూవచ్చు. ఈనాటి కవిత్వానికిది స్థూల విభజన మాత్రమే.

డా॥ ప్రభావతిగారి కవిత్వంలో మనిషి, మనిషి మనుగడ, మానవత, మానవీయ దృక్పథం మొదలైన అంశాలు ప్రధానంగా చోటుచేసుకున్నాయి. ఆమె ఆరాటమంతా సామాజిక సంక్షేమాన్నికోరే మానవతా వికాసం గురించి. తనచుట్టూ పరచుకొని ఉన్న వస్తుజాలాన్ని చూసినప్పుడుగాని ప్రకృతి దృశ్యాలను పరికించినప్పుడుగానీ ఆమె స్పందించి, సామాజిక స్పృహను మేళవించి కవిత్వంగా పలుకుతుంటుంది. కాల్పనికతనూ వాస్తవికతనూ సమపాళ్ళలో మేళవించి విశ్వకళ్యాణ దృక్పథం కల కవిత్వం వెలువరిస్తుంది. ఒకచోట మనిషిని ఎంతటి మహోన్నతంగా వర్ణిస్తున్నారో చూడండి —

మనిషి హృదయానికి కొలమానం ఆకాశం
ఆకాశానికి కొలమానం మనిషి హృదయం,

ఈనాడు సమాజంలో మానవత దినదినం అడుగంటుతున్నది. మనిషిని మనిషి పీక్కుతింటున్నాడు. ప్రపంచ మంతటా ప్రతినిత్యం మానవ మారణ హోమం మామూలైంది. ఈ దుస్థితి కవయిత్రి ఈ విధంగా చిత్రిస్తున్నది.—

మనిషి మనిషి మధ్యదూరం
రబ్బరుబాండులా సాగుతోంది.
మనిషంటె మనిషికి వేపచేదు
మనిషంటె మనిషికి అంతులేని భయం

మనుషుల్లో వివిధ మనస్తత్వాల వాళ్ళుంటారు. వివిధ అంతస్తుల వాళ్ళు ఉంటారు. దీన్నే రచయిత్రి మనకీవిధంగా చూపుతట్టిస్తున్నది—

రకరకాల సరకులకు ఆలయం బజారు
రకరకాల మనుష్యుల కొలువుకూటం బజారు

ప్రభావతిగారు అనురాగం, ఆర్ద్రత, ప్రేమ, స్నేహం, చిరునవ్వు లాంటి నాజూకైన మానవీయ లక్షణాలు ప్రపంచంలో బాగా విరబూయాలని ఆకాంక్షిస్తుంది. వాటికోసం పరితపిస్తుంది. వాటివల్ల మానవ సంఘంలో ఆనందం తాండవిస్తుందని విశ్వసిస్తుంది, అందుకే ఒకచోట చిరునవ్వును మనోజ్ఞ సుందరంగా వర్ణిస్తుంది.—

స్నేహానికి ప్రేమకు ఆత్మీయతకు
ఎగురవేసిన జండా చిరునవ్వు

అంతేకాక సామాజిక సంవేదనకూడ ఆమెలో సుడులు తిరుగుతుంటుంది. ఈ దేశంలో రైతు అన్నివిధాలా నష్టపడుతున్నాడు. అతని జీవితం దినదినం దుర్భరమైపోతున్నది ఈ సత్యాన్ని గమనించిన కవయిత్రి పడిన బాధ ఈ పంక్తుల్లో వ్యక్తమవుతున్నది—

ఆ రైతుల కష్టంతో
ఈ దేశం పెరుగుతోంది
ఆ రైతుల బ్రతుకులు మాత్రం
ఇంకా గుడిసెలలోనే వేలుడుతున్నాయి

కష్టజీవులన్నా కార్మిక కర్షక లోకమన్నా ప్రభావతిగారికి ఎంతో సానుభూతి. తునాతునకలైపోయినవాళ్ళ జీవితాలను చూసిఅనుకంపననుభవిస్తుంది.

వాళ్ళ ఆలోచనలతో. వాళ్ళ జీవనరాగంతో తన్మయత్వం పొందుతుంది. అందుకే—

పొట్టచేతపట్టి పరుగులు పెట్టినపక్షులవలె
కష్టజీవులు తిరిగి గూటికి చేరేవేళ

అంటూ ఒక్కమాటలో వాళ్ళ యాంత్రిక జీవితాన్ని, శ్రమజీవన తత్వాన్ని రూపుకట్టిస్తుంది.

ఇట్లా డా॥ ప్రభావతిగారు ఈకవితా సంపుటిలో సామాజిక సంవేదనను ధ్వనింపచేసే మానవతా వికాసవాద ధోరణిని కళాత్మకంగా కవితా మయంగా వ్యక్తం చేసినారు. మనిషిలోని చెడును శాశనంచేసి మనిషి మనిషిగా ఎదిగి మానవతకు పందిళ్ళువేసి సమాజ సంక్షేమాన్ని సమకూర్చాలన్నది ఈ కావ్యార్థం. ఇది అందరికీ కావలసింది, అందరూ అభిలషించేది ఇంతటి సందేశాత్మకమైన ఈ చిక్కని కావ్యాన్ని అందించినందులకు డా॥ వాసా ప్రభావతి గారిని అభినందిస్తున్నాను. ఆనందిస్తున్నాను.

**ఆచార్య పేర్వారం జగన్నాథం**

1/705/5-I-C, మిథిలానగర్
బాలసముద్రం - హనుమకొండ
వరంగల్లు - 506 001.

# విషయ సూచిక

# వెలుగు వచ్చే వేళ

ఉదయాద్రిని అధిరోహించే సూర్యుడు.

చీకటి రాసులను చీల్చుకుంటూ

మబ్బులను, మంచు తెరలను తోసుకుంటూ

మేలిమి బంగరు తీగల్లా సాగివచ్చే సూర్యకిరణాలు.

లోకమంతా విరజిమ్మే తెల్లని కాంతి.

ప్రకృతి అంతా పులకించే చైతన్యం.

మట్టిముద్దల్లో పడివున్న

జీవరాసుల్లా వెచ్చని కదలికలు.

రెప్పలు విప్పిన కంటి చూపుల్లో
కదిలే సుందర దృశ్యాల మెరుపు రేఖలు.
బద్ధకస్తులకు ముందుచూపులేని
మొద్దుతనపు ముద్దరాలికౌగిళ్ళు.
నడక నేర్చిన మనుష్యుల అడుగుల చప్పుళ్ళు
వెలుగు వేళకు తప్పెట నాదాలు.
కొండచిలువల్లా చలిగాలులు చుట్టుముట్టుతున్నా
క్రూరమృగాల్లా వర్షధారలు మీద పడుతున్నా
బతుకు తెరువుకోసం పరుగు పెట్టే
జనుల వెచ్చని నిట్టూర్పులు
వెలుగుబాటలకే మేలుకొలుపులు.
దూరంగా వినబడే ఫ్యాక్టరీ కూతలు
కాలాన్నే కదిపి లేపే సన్నాయి మోతలు.
వీధుల్లో పేరుకున్న చెత్తకుండీల దుర్గంధాన్ని
దూరానికి నెట్టాలన్న తెమ్మెరల ప్రయత్నం
మనిషి గుండెల్లో పేరుకున్న సంకుచితాల కుళ్ళును
కడిగివేయాలనుకున్న సంఘ సేవకులకే ఆదర్శం.
ఆరోగ్య దీపాల్లా ఆటస్థలాలకు కదలి వెళ్ళే

వెలుగు వచ్చేవేళ

చిన్నారుల చురుకు గమనం
వెచ్చని రవికిరణాలకే మొట్టికాయలు.
ఆపిల్లల ఆటల కేరింతాలు
బద్ధకస్తుని చెవుల్లో పేల్చిన
బాణసంచాల మ్రోతలు
బస్సుల పాలవానుల హారనులు
ఎందరో జనులకు ఆందోళనా నివృత్తులు.

ఇంటి ముందు పాలవాని పిలుపు
గుక్కపెట్టిన చంటి పిల్లల తల్లుల
ముఖాలకే వెలుగు రేఖలు.

ఎరకై రెక్కలు విప్పిన పక్షుల పయనం
పొట్టపోషణకై కూలి పనిని వెతుక్కుంటూ
బయలు దేరిన పేదవారికి ఆశాగీతం.

దేశ విదేశ విశేష విచిత్రవార్తలనన్నిటినీ
మూటకట్టి ముంగిట విసరినట్లుగా వచ్చే
దిన పత్రికకు ఎదురుచూసే జనులచూపులు
వెలుతురు పటాలకు పదుగు పేకలు.

ఆకలితో నిద్రపట్టని మనుజుల చెవుల్లో

గుక్కతిప్పుకోని దోమల రొదలకు ఆటకట్టు.

యూపోం పరువులపై గురకపట్టేవారి

కలల రెక్కలకే సుత్తిదెబ్బలు.

పరీక్షలకు చదివే విద్యార్థుల పఠనాలు

వెలుగు దేవతను మేలుకొలిపే వేదమంత్రాలు.

మంచి నీటి కుళాయిల నీటి ధారల శబ్దం

జనుల గుండెల్లో పన్నీటి జల్లులు.

కుల మతాల తారతమ్యం తెలియనిది

ప్రాణు లందరికి వెలుగు పంచేది

నిత్యనూత్న చైతన్య స్ఫూర్తినిచ్చేది

వెలుగు వచ్చేవేళ.

21-12-89



# మనిషి

తనచుట్టూ వున్న సమాజపు
భవనాల అంచులపై పరుగులు పెడుతూ
తనచుట్టూ ఉన్న ఆలోచనాబంధాలతో
ఆటలాడుతూ
పెనవేసుకున్న మమకారాలవడిలో
కేరింతాలాడుతూ
తనకొరకే కాక
తన చుట్టు ఉన్నవారికై
ఆలోచించి ఆచరించె
ఉదారమూర్తి మనిషి.

మహా సంద్రాన్ని పోలిన హృదయంతో
పడిలేచే తరంగాలవంటి
ఆలోచనా ఆయుధాలతో
ఉవ్వెత్తున ఎగసి పడుతూ
కాలికింద నేలను తవ్వే
పరుల ప్రయత్నాల పెనుతుఫానులో
నిశ్చలంగానిలబడి
నిర్భయంగా పలికే
సాహసమూర్తి మనిషి.

పాతబాటలు గతాన్ని జ్ఞప్తికి తెస్తున్నా
గతుకుల బాటలు బొప్పిలు కట్టిస్తున్నా
కొత్తబాటలు చిమ్ముకుంటూ
నవ్యభావం పేర్చుకుంటూ
సాగిపోయే చైతన్య రూపంమనిషి.

అరిష్వర్గాల హాహాకారాలలో
పురుషార్థాల కొలిమి చిచ్చులలో
ప్రజ్వరిల్లే నూత్నరూపం
పదగలెత్తే నవ్యభావం మనిషి.

## వెలుగు వచ్చేవేళ

వేయి గొంతులు తనలో ఉన్నా
పదివేల గొంతులు తన చుట్టూ వున్నా
తీయనైన పిలుపులతో
నవ్యమార్గం తలుపుతట్టాలని
కొత్తదనం తొంగి చూడాలని
నవ్యగీతం పాడాలని
గొంతులు పూరించే నవ్యరాగం మనిషి.

స్వార్థం నోరుతెరిచి నిప్పులు కక్కుతుంటే
దేశప్రగతి చేతులు చాచి పిలుస్తుంటే
పరులకోసం పరుగులెత్తేవాడు
అందరిలో తానొక్కడై నిలిచేవాడు
అందరి భుజాలు తట్టి
ముందుకు నడిపేవాడు మనిషి.

అజ్ఞానం చుట్టూ ఆవరించి వున్నా
విజ్ఞానపు దీపం వెలిగించాలని
ఆ వెలుగులో అందరిని నడిపించాలని
ఆటంకాల అగ్ని శిఖలను ఆర్పుకుంటూ
అవరోధాల పెనుతుఫానులు దాటుకుంటూ
ఫలోన్ముఖుడయ్యేవాడు మనిషి.

బద్ధకం సోమరితనాన్ని మప్పుతున్నా
అవసరం చేతనాన్ని మేల్కొలుపుతుంటె
ఎదురు వీచే పరిహాసాలను తోసుకుంటూ
దారిపోడుగునా ప్రయత్నాన్ని విత్తుకుంటూ
జీవితాన్ని సాగుచేసే వాడు మనిషి.

ఎన్ని కళలు నేర్చినా
ఎంతరాగం నింపుకున్నా
ఎన్ని పదవులు చేపట్టినా
మరో మనిషి సుతిమెత్తని
పలుకుల మువి వేళ్ళతో
తన హృదయ వీణ మీటాలని
కొత్తరాగాలు పలికించాలని
తపించే కళాతపస్వి మనిషి.

తనచుట్టూ ఎగసిపడే ధూళిరేణువులతో
బరువెక్కిన తన కనురెప్పలను
ఏచల్లని హృదయ తరంగమో విచ్చేసి
తన కనురెప్పలపై కప్పిన
ధూళిని తొలగించి
తన జ్ఞానేంద్రియాన్ని మేలుకొలపాలని

వేలుగు వచ్చేవేళ

విశ్వగీతం ఆలపించాలని
తపించే గీతం మనిషి.

నిత్యం తన ఆలోచనలకు
కొత్తనగిషీలు చెక్కాలని
కొత్త ఆలోచనా పుష్పాలు పూయించి
కొత్త సుగంధాలు మోయించాలని
నిత్యం పరిశోధనగావించె
పరిశోధకుడు మనిషి.

ఎన్ని జీవులు పుక్కిలించి ఉమిసినా
తరగని సముద్ర జలంలా
ఎందరు నమిలి మింగినా
తరగని గుప్పెడు హృదయంతో
ఆలోచనా తెరచాపలను ఎత్తి
ఈ విశాల ప్రపంచ సంద్రాన్ని
అవలీలగా దాటాలని
ప్రయత్నించే వాడు మనిషి.

ఆపదకు కరిగినా
కోపానికి ఫెరిగినా

సంతోషానికి ఉబికినా
స్థానం విడువని హృదయంతో
ఆలోచనా బాణాలు పేర్చుకుంటూ
ఆకాశంలో నక్షత్రంలా వెలిగేవాడు
లోహాల్లో బంగారంలా మెరిసేవాడు మనిషి.

మానాభిమానాలను
సంధించే ఆరడుగుల మనిషి
అవమానం ఎదురైతే
వామనుడై ఆకాశం ఎత్తుకు పెరిగేవాడు
ఏ ఆయుధాలు చేతలేకుండానే
ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ
దేశాలు ఏలేవాడు
ప్రగతిమార్గం పేర్చేవాడు మనిషి.

పట్టుదలే ప్రాణంగా
ప్రయత్నమే ఊపిరిగా
చైతన్యమే మేలుకొలుపుగా
అవయవాలె పరికరాలుగా
పనిచేసే రూపం మనిషి.
అందుకే సూర్యునిలా నిత్య చేతనుడు.
చంద్రునిలా అమృత వర్షుడు మనిషి.

12.7.91

# నా వూరు

నా వూరు నంటిపెట్టుకుని పారుతూ
ఎన్నడూ ఆవూరు వదిలిరాని
గోదావరీతల్లి తరంగనాదాలె
నా వూరుకు నిత్య మంగళ వాయిద్యాలు.
నా వూరు పక్కగా గోదావరమ్మ వాలుజడలా
పరుచుకున్న కాలువ పాయల్లో
పడగల్లా కదలె పడవలె
అచ్చటి వర్తక వ్యాపారాలకు ప్రతీకలు.

నా వూరు గట్లమీద పచ్చని చెట్లపై
పెరిగిన చిలకా గోరింకల ముద్దు పలుకులె
వచ్చిపోయే వారికి చల్లని పలకరింపులు.

నా వూరు మట్టి పుంతలలో
నేను నడిచిన
నా అడుగు జాడల గుర్తులే
నా తలపులలో మెరిసే
విలువైన జ్ఞాపికలు.

ఆనాడు నా కాలినంటి
నేటికి ఆరిపోనీ ఆ బురదమరకలే
నా భవితవ్యానికి వెలుగుబాటలు.

ఆవూరు మధ్యలో మామిడి తోటలో
ఆనందంతో నే ఊగిన ఊయల
మాయింటి ముంగిటిలో
నే నాడిన గోలీల గుంటలు
తరతరాల పిల్లల
బాల్య క్రీడలకు వెచ్చని పొత్తిళ్ళు.

వెలుగు వచ్చేవేళ

మా పెరటిలో జామచెట్టు కొమ్మనుండి
నేను జారిపడిన నాటి
నా నుదిటి బొప్పిని
తడుముకు చూచినప్పుడు
ఎన్ని బొప్పిలు కడితే
జీవిత మవుతుందోనని
తెలియ జెప్పె నా అనుభవమే
నా భవితవ్యానికి మేలుకొలుపులు

నా పల్లెలో నేను ఆడిన
చెమ్మ చెక్కలు, కోలాటాలు, గోటిబిళ్ళలు
నేటికి కొనసాగుతూ
అక్కడి పిల్లల ఆనందానికి
ఆరోగ్యానికి వారసత్వంగా నిలిచాయి.

నే ఒరిగిన ఆ పెద్దల మమకారాల వొడులే
నేటి పిల్లలకు మమకారాల కొండలు
పాల నురుగులా స్వచ్ఛంగా వుండె
అక్కడి స్నేహాలు, బంధుత్వాలు
నేటికి మచ్చలేని పూర్ణబింబాలు.

అనురాగపు మధువును చిందించె
ఆ పల్లెవాసుల మాటలె
నేటికీ ఎండిపోని ఊటబావులు.

ఆ నదీమ తల్లివడిలో
పెరిగే నిత్య పచ్చదనాలే
ఈ దేశానికి నిత్యాన్నదాతలు.

ఆ రైతుల కష్టంతో
ఈ దేశం పెరుగుతోంది
ఆ రైతుల బతుకులు మాత్రం
ఇంకా గుడిసెలలోనె వేలాడుతున్నాయి.

అక్కడి జనుల మంచితనం
మంచిగంధంలా దేశమంతా గుబాళిస్తున్నా
వారి బతుకులు మాత్రం
గాలి వానలకు, వరదలకు బలిఅవుతూ
భయాందోళనలతో బిగుసుకుపోతున్నాయి.

నాకు అడుగులు నేర్పిన నేలతల్లి
నాలో నిత్యం శంఖారావమై ఆలపిస్తోంది.

నాకు అక్షరాలు నేర్పిన ఆ బడి
నా గుండెలో గుడిగా వెలుగుతోంది.

ఆ నాడు అల్లిబిల్లిగా
అల్లుకున్న భావ పరంపరలే
ఈనాటి నా గొంతులోని
కవితాధారలు

అయినా నాపూరు ఎక్కడ వుందని?
నా గుండె వాకిటిలో
పచ్చదనమే.
పరుచుకున్న పచ్చదనమే.

23-4-90



# తేడా

మేఘం నల్ల బడితే
వర్షించి పుడమి తల్లిని
పులకింప చేస్తుంది.
మనిషి మనసు నల్లబడితే
తోటి మనసును నలిపి
పుడమిపై అలజడి రేపుతుంది.

# చీకట్లు ముసిరేవేళ

పగటి జీవితాన్ని పరిపూర్తిచేసి
విముక్తుడైన గౌతమునివలె
కాషాయాంబరధారుడు ఆర్కుడు
పడమటి కొండను చేరేవేళ.

వెలుతురును తుడుచుకుంటూ
లోకంకన్ను మూయాలని
తరుముకువచ్చె చీకటివలె
దొంగల, దోపిడీదారుల, హింసాప్రవృత్తుల
బుద్ధులు వక్రించే వేళ.

చీకటి అల్పిక ఆర్భాటాన్ని చూసి
భయపడే బద్ధకస్తులు, పిరికిపందలు
సాగేకాళ్ళను ముడిచేవేళ.

నిశ్చలంగా, నిర్మలంగా
తమపనులు సాగించుకునే
సాహసమూర్తులకు యోగవేళ.

చీకటిసినిరా చెదరగొడుతూ
ఆకాశంలో పొడుచుకువచ్చే
నక్షత్ర మండలంలా
నేలపై దీపాల కాంతులు
చీకటిని కాల్చేవేళ.

వయసులో ఉన్న వారి మనసులు
కొత్తకోరికలతో కలవరపడుతుంటె
దోరకాయలు పిల్లగాల్లులా
కొంటె చేష్టలు చేసే వేళ.
తెల్లని పువ్వులు వికసిస్తూ
సుగంధాలు విరజిమ్మేవేళ.

పొట్టచేతపట్టి పరుగులు పెట్టిన పక్షులవలె
కష్టజీవులు తిరిగి గూటికి చేరేవేళ.

మురికి ఇళ్ళలో
ఇరుకు పాఠశాల గదుల్లో
ముక్కి పోయే పిల్లలు
ఆట స్థలలో ఆట పాటలతో
హాయిగా గాలిపీల్చుకునే వేళ.

పగలల్లా సంపాదనకై
పని చేసే జీవులన్నీ
కాపురాలు చేసే వేళ
జీవిత రహస్యాలకు
అర్థాలు చెప్పే వేళ.

రుచులు మరిగిన నాలుకలు
అర్రులు చాచె ఉదరాలు
కళ్ళు మూసుకుని పడుండేవేళ.

రాత్రి కాంత అందం
మిరు మిట్లు కొలిపేవేళ.
చల్లని వెన్నెల అల్లుకునే వేళ

తరం వెంట తరం నడిచినట్లుగా

గొప్పవారి వెనుక మరోగొప్పవారు

ఉదయించి లోకాన్ని ఉద్ధరించినట్లుగా

సూర్యుని వెనుక చంద్రుడు

లోకంలో ఉదయించే వేళ.

వెలుగు వెంట చీకటి

సుఖాల వెంట కష్టాలు

జననంవెంట మరణాల్లా

ఉదయ అస్తమయాలు.

మనిషి అజ్ఞాన విజ్ఞానాల ఆవిర్భూతాలు.

12-5-90



# దూరం

ఊళ్ళూ ఊళ్ళూ కలిసి పోతున్నా

ఊళ్ళ మధ్య దూరం పెరుగుతోంది.

మనిషి మనిషి అంటుకున్నట్లుగా
ఇళ్ళ రాసులు పెరిగి పోతున్నా

మనిషి మనిషి మధ్య దూరం

రబ్బరు బాండులా సాగు తోంది.

మనిషంటె మనిషికి వేపచేదు.

మనిషంఠె మనిషికి అంతులేని భయం.

ఎదుటి వాని తీయని పిలుపులకు
చెవులు తాళాలు.
పక్క వానింట్లో చెడుకు
గుండెకే పరమాన్నాలు.

కులమతాల గోడలు
అగ్ని పర్వతాల ఆకారాలు.
ఉపకారమంటె అరికాలి మంట.
ద్వేషం అన్నిటా గంతులు.

కామం గల్లీ గల్లీలో గంతులు.
క్రోధం ఇంటి వాకిట్లో కాపురం.

విమానాల రాకపోకలు
దేశ దేశాలలో.
స్నేహం మాటల్లో.
చేతల్లో అణుబాంబు ప్రయోగాలు.

గుండె మరమ్మత్తులకు
ఆసుపత్రులు మెకానిక్ షాపులు దండగ,
పైసాకర్చు లేకుండా.
ధూర్తాలు తగ్గాలంటె

సంస్కారం, లోకజ్ఞానం
జంక్షన్ చెయ్యాలిగుండెకు.
పెరిగే దూరం చెవులు పట్టి
దగ్గరకు జరపాలి.
మరిదూరం పారిపోకుండా
కాళ్ళు కట్టెయ్యాలి.
దూరమంటె కిలో మీటర్లు కావు.
దూరమంటె మనిషి ఒంటరితనం.
మనిషికి పనికిరాని
అంటరాని తనం.
మనిషి పెంచుకున్న
స్వార్థపు భవనం.
మనిషి పెంచుకున్న అహంకారం.
అభిమానాన్ని హరించేది.
ప్రేమను విరిచేది దూరం.

మనిషికీ మనిషికీ మధ్య
దూరం పెరిగితే
దేశానికి చేటు.

దేశానికి దేశానికి మధ్య
దూరం పెరిగితే
ప్రపంచానికి చేటు.
పెంచుకున్న నాగరికత
అనాగరికతగా
పెరిగిన విజ్ఞానం అజ్ఞానంగా
తల క్రిందులవు తాయి.
ద్వేషం కుమ్మకుంటుంది.
క్రోధం పెట పెటలాడుతుంది.
అందుకే దూరం దగ్గర వ్వాలి.
ప్రేమాభిమానాలు పెన వేయాలి.
సుఖసంతోషాలు వెల్లివిరియాలి.

20-6-90

卐 卐

# ఒక మనిషిని నేను

నాలుగు చెరగులా చాచుకొని
కనపడిందల్లా దోచుకోడానికి
మాయ చేసి గొంతులు నొక్కి
సంచులు నింపుకోడానికి
మే జీలకింద సాగిపోతూ
కుర్చీలను అంటి పెట్టుకుని
జేబుల్లో ముడుచుకోడానికి
నాకు నాలుగు చేతుల్లేవు.

కష్టించి పని చేసి సంపాదించి
కళలను కవిత్వాలను పెంచడానికి
నీరు పోసి మొక్కలను పెండడానికి
పాలు పోసి పిల్లలను పెంచడానికి
నాకున్నవి రెండే చేతులు

చెప్పింది చెప్పకుండా
స్తోత్రపాఠాలు చేసుకుంటూ
ఛత్రాజుల్లా వెంట తిరగడానికి
అతిశయోక్తులతో ఆడంబరాలతో
కుయోక్తులతో చొక్కాలు కుట్టించి
అందంగా తొడిగించడానికి
అబద్ధాల మెరుపులలో వర్ణించి
నగిషీలు చెక్కి మెప్పించడానికి
వెయ్యి నాలుకలు లేవునాకు.
మాటంటే నమ్మకమున్నది.
ఎటు పడితే అటు పడిగెత్తి
పార్టీల మార్పిడి చెయ్యలేనిది
అవసరానికి ఆదుకునేది

స్థిరంగా నమ్మిన చోటనిలిచేది
నిధానంగా కదిలేది
పరుల మనస్సు నొప్పింపక
తానొవ్వక సూటిగాకదిలేది
నాకున్నది ఒక్కటే నాలుక.

పదిరకాలుగ ఆలోచించి
పదిమందికి ముప్పుతలపెట్టి
ఆర్భాటంగా పయనించి
పలురకాల విజ్ఞానాన్ని
తలక్రిందుగా నేర్చుకోడానికి
లేని తెలివిని పోతపోయడానికి
అల్పకులను భయపెట్టడానికి
నాకు పదితలలులేవు.
ఉన్న ఒక్క ప్రధానాంగంతో
పదిమందికోసం ఒక్కలా ఆలోచించి
ఆచరించడానికి నాకున్నది ఒక్కటే తల.

దారులు తప్పి తిరగడానికి
హద్దులు చెరిపి మసలాడానికి
ఎటు గాలి వీస్తే అటు పరుగెత్తడానికి
నాలుగు జతల కాళ్ళు లేవునాకు.

జీవిత మార్గంలో స్వేచ్ఛగా
తడబాటు లేక అడుగు వెయ్యడానికి
వెలుగుబాట వెంటనంటి పయనించడానికి
నాకున్నవి రెండే కాళ్ళు.

అందనిదిపోగు చేసుకొని
అందినది అదుపులేక
పరుల సొత్తును.
నోరులేని వారి పొట్టలను పిట్టల్లాకొట్టి
కొట్లో పడేసినట్లుపడేస్తే
అరాయించుకోడానికి
నా జఠరాగ్ని అంగుష్ఠ మాత్రముకానిది
నేనువృకో దరుణ్ణికాను.
అనారోగ్యాలు అజీర్ణాలు
కడుపునొప్పులు తెలియని
జీనెడు పొట్టినాది.
సంపాదించి తెచ్చుకొని
పొట్టపట్టినంత వరకే
సంతృప్తిగా తినడానికి
నాకున్నది ఒక్కటే పొట్ట.

క్రోధాన్ని పెంచుకొని అగ్నిని కురిపించి
చల్లని లోకాలను భస్మం చెయ్యడానికి
తరతమ భేదాలు సృష్టించి
కిందమీద చెయ్యడానికి
నాకు మూడు కళ్ళు లేవు.

మంచితనంతో మానవత్వంతో
ఒళ్ళంతా కళ్ళు చేసుకొని
సమతా భావంతో వెలగడానికి
నాకున్నవి రెండే కళ్ళు.
నా కళ్ళలో పువ్వులు లేవు.
నా కళ్ళకు పచ్చకామిర్లు లేవు.
నా కళ్ళకు లోకమంతా
ఒక్కలా కనబడుతుంది.
దీర్ఘదృష్టులు, హ్రస్వదృష్టులు
అల్పదృష్టులు నా కళ్ళకు లేవు.
నాకున్నవి రెండేకళ్ళు.
ఒక మనిషిని నేను.

29-7-90.

# భయం

పిల్లలకు, పెద్దలకు
చదువుకున్నవారికి
చదువులేని వారికి
ఉన్న వారికి లేనివారికి
పగలు భయం.
రాత్రి భయం,
అందరికి యేదో భయం.
విశ్రాంతి యెరుగని భయం.

ఆదాయాన్ని నేలమాళి గలలో దాచి
దొంగ లెక్కలు చూపించే వారికి
ఆదాయపు పన్ను భయమైతే
వ్యాపారస్తులకు కందుమీదయ్యే
వస్తువు ధరల భయం.
ఆఫీసుల్లో ఫైళ్ళకింద చేతులు చాచేవారికి
కష్టమర్స్ భయమైతే
దొంగవ్యాపారస్తులకు
కష్టమ్స్ వారి భయం.
ఇంట్లో మూటలు దాచేవారికి
వడ్డీ వ్యాపారస్తులకు
దొంగల భయమైతే
మెడనిండా నగలవారికి
బీరువానిండా పట్టుచీరల వారికి
డెకాయిట్ల భయం.
రౌడీలకు రౌడీల భయం.
గూండాలకు గూండాల భయం.
నేరస్తులకు పోలీసు భయం.
పిల్లల తల్లితండ్రులకు
పాఠశాలల్లో డొనేషన్ల భయం.

పిల్లలకు మార్కుల భయం.
పరీక్ష హాల్లో కాపీలు చేసేవారికి
నిరీక్షణా దళాల భయం.
కాలేజీల మేనేజ్‌మెంటు వారికి
ఫీజు కలక్షన్ భయం.
వయసులో ఉన్న ఆడు వారికి
రోడ్ రోమియోస్ భయం.
వయసు మీరిన వారికి
కాలక్షేప భయం.
మేధకులకు మోసాల భయం.

నోరెక్కువ వారికి
కజ్జాల భయం.
నోరు తక్కువ వారికి
లెక్కించని భయం.
భయస్తులకు అన్నీ భయాలే.
భయం కల
భయం నిద్రమత్తు.
భయం బద్ధకం.
భయం తెచ్చిపెట్టుకున్న జాడ్యం.
భయం పనికిరాని గుణం.

వాసా ప్రభావతి

దెయ్యాల వంటి భయాలను నెట్టి
కడిగిన ముత్యంలా స్వచ్ఛంగా నిలిచిన నాడు
కక్కూర్తి చంపుకొని కదలిననాడు
తన కాళ్ళపై తాను నిలబడి
తన చేతుల సంపాదనకే విలువయిచ్చిన నాడు
నిర్భయంగా నిశ్చలంగా
మనిషి చైతన్యంతో సాగిపోతాడు.
అప్పుడు భయమే తెలియదు.

18-7-90.

卐 卐

# వస్తువుల కొలువు

ఉదయం తలుపులు తెరచినా
కళ్ళు తెరవని బజారు.
రెండవ ఆట సినిమా చూసిన ప్రేక్షకునిలా
సూర్యకిరణాలు చురుక్కుమంటేనే
ఊపిరి పోసుకునే బజారు.
సంధ్యాసమయ సౌందర్యంలో
ఘన భోంతరాళంలో నాట్యం చేసే
ప్రకృతి నాట్యకన్యలా
మెర్క్యురీ బల్బుల కాంతుల్లో
మెరిసిపోయే బజారు.

వర్షకాలంలో కొండలపై వేలాడు
మబ్బుల గుంపుల్లా సాయంకాలం
బజారునిండా బస్తీ జనం.
కొందరి జేబుల్లో చిల్లర గలగలలు.
మరి కొందరి జేబులనిండా ఇంధనం.
జనం మధ్యలో కోడిపిల్లల వేటకు
తహతహలాడె డేగ చూపులతో
దొంగల్లాంటి దొంగలు.
జేబులకో, మెడలకోగాటు పడితే తప్ప
దొంగల అనుభవం తెలియని జనం.
చే చిక్కగానే మనుష్యుల మధ్యలో
కలిసిపోయే దొంగ మనుష్యులు.
రంభా ఊర్వసుల్లా ముస్తాబులై
షోకేసుల్లో బొమ్మలు కళ్ళ జిగేలు మనిపిస్తుంటే
రెప్పవాల్చక నిలిచిపోయే జనం.
బజారులో మరింత రద్దీ.
తల్లులు, తండ్రులు—
మధ్య చిలుత, బుడుత పిల్లలు.
పిల్లల ఆకలి ఆక్రందనలు.
విసుక్కునే తల్లి తండ్రులు
కొందరి పిల్లల కేరింతాలకు

సంబరపడే తల్లి తండ్రులు.
స్నేహితుల దరహాసాల జల్లులు
అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ
చేర సారాల సందడి.
పనిలేని వారి పకపకలు
రౌడీల కోపతాపాలు.
గాండ్ లీడర్ల మాటల విసుర్లు
బజారో పెద్ద ప్రపంచం.
కులమతాలు తెలియని జనం
స్త్రీ పురుష భేదం తెలియని జనం
కష్ట సుఖాలు మరిచే ఆనంద వెల్లువ.
షాపులనిండా కొత్త వస్తువుల కొలువులు
ఎక్కిదిగే జనుల అడుగుల చప్పుళ్ళ
విమర్శనా ధోరణుల మోతలు.
విసుక్కునే షాపుల వారు.
ముడుచుకునే చేతులు
మధ్యలో వలసవచ్చిన పక్షుల్లా
తోపుడు బళ్ళ గుంపులు
మోసానికి ఆలయాలు కొన్ని.
సగటు రేటుకు కొన్ని
చకచకగాసాగిపోయేవి కొన్ని.

ఆకలితో వున్న జంతువుల్లా
రకరకాల ఆకర్షణ అరుపుల పిలుపులు
బేరం చేసి చేసి విసిగి వేసారెవారు
చెప్పిన ధరకు కాస్త తగ్గికొనేవారు
చూసినదానికల్లా వంకలు పెట్టి
ఏదీ కొనక తిరిగి వచ్చేవారు
కనపడినదల్లా కొని
జేబులు కాళీ అయితే
మోసపోయామని మొత్తుకునే వారు.

పైసా ఖర్చు పెట్టడానికి యిష్టపడక
తోడువచ్చిన వారి నెత్తిని
ఖర్చులు పడేయాలని ప్రయత్నించే గడుసరులు
రకరకాల సరకులకు ఆలయం బజారు.
రకరకాల మనుష్యుల కొలువుకూటం బజారు.
జ్ఞానం వచ్చిన యౌవ్వన వతిలా
తన డిమాండు తాను చూసుకునే బజారు.
అలసిపోయిన మనిషిలా
విశ్రాంతి వెతుక్కునె బజారు
పసిడి పైకంతో నిండిన ఇంటిలా
తగు జాగ్రత్తపడే బజారు
తలుపులు మూసుకుని తాళాలు వేసుకునే బజారు.

రాత్రివేళ భూ దేవతలా బజారు.
కళ్ళు మూసుకునే బజారు.
వేలకు వేలు బజారులో
చేతులు మారుతాయి.
లాభ నష్టాలు మామూలె.
సరకుల్లో తేడాలు.
అమ్మకంలో తేడాలు
మానవ నైజమే
ఎక్కడ చూసినా
న్యాయాన్యాయాల పోరాటం
కొందరి బ్రతుకులు
బజారులో తెల్లారిపోతాయి
మనిషిని కుబేరుణ్ణి చేసినా
పాతాళానికి తీసినా
బజారుకే చెల్లుతుంది.
విలువలేని వస్తువు
బజారులో పడగానె
సినీమా స్టారులా రేటు పెంచుకుంటుంది.
డిమాండు పెరిగిపోతుంది.
సామాన్యుడు ధరల వెంట
పరుగిడలేక బోర్లాపడితే

పకపక నవ్వుతుంది బజారు.
కాలగమనం బజారుది.
కాలనైజం బజారుది.
కళ్ళతో చూస్తుంది.
నోరు విప్పి పలుకదు.
ములిగిన వారిని
తేలిన వారిని ఒక్కలా చూస్తుంది.
అయినా బజారంటే అందరికీ యిష్టమే.
మనిషికి బజారు ముఖ్యం.
సరుకు కొనాలన్నా
సరుకు నాణ్యం చూడాలన్నా
పాతసరకు అమ్మాలన్నా బజారే కావాలి.
పదిమందికి కూడలి అది.
మోసాలకు పుట్టినిల్లు అయినా
లాభాలకు గట్టిమనసు బజారు.
జనానికి కూడలి.
స్నేహానికి నిలయం బజారు.
బజారు లేనిదే మనిషికి తిండిలేదు.
పండిన సరకుల పొరిపిల్లు అదిది.
ఎగుమతి దిగుమతి వ్యాపారాలకు నిలయం.
సరకులు పండించే వారికి

నరకులు అమ్మే వారికి

సరకులు కొనేవారికి

ఆలవాలం బజారు.

ఉత్సాహానికి, దెల్లాసానికి

కావాలి బజారు.

రంగు రంగుల చీరలు,

రకరకాల చీరలు

జరిచీరలే కాదు

పిల్లల పెద్దల అవసరాలు

తిను బండారాలు,

సకల కళల వస్తు సామాగ్రికి

ప్రదర్శన శాల బజారు.

అందుకే మనిషికీ బజారుకు

చెప్పలేని అనుబంధం.

బజారు ఒక ఇంద్రధనుస్సు

మనిషి ఒక ఇంద్రజాలకుడు.



18.10.90

# గమనానికి మార్గదర్శి

భూదేవికి నల్లని వాలుజడలా
అందంగా పరుచుకున్న రోడ్డు
మానవ గమ్యానికి వెలుగు రేఖ.
వాహన గమనానికి మార్గదర్శి.
పగలు, రాత్రి తేడా తెలియక
ఎల్ల వేళలా ఒక్కలా
నడుచుకునే సౌమ్యమూర్తి రోడ్డు.
ప్రశాంతంగా నిలిచే సౌందర్య మూర్తి రోడ్డు.

భూదేవి పాపటలా వంకర్లులేక
నిలువుగా సాగిపోయేది
నేలను కరచుకుని నిలిచేది రోడ్డు.
ముఖానికి పాపట అందం.
నేలకు రోడ్డు అందం.
రోడ్డులేని నగరం
రోడ్డులేని పల్లె వుండదు.
అందరికి రోడ్డు కావాలి.
అన్నింటికీ రోడ్డు కావాలి.
జన సంచారానికి చిహ్నం రోడ్డు.
జన నిర్మితం రోడ్డు.
రెండు వూళ్ళకు వంతెన రోడ్డు.
రెండు నగరాలకు నిచ్చెన రోడ్డు.
పగటివేళ సూర్యకాంతితో
పట్టుచీర కట్టుకున్న పడుచులా
ధగధగలాడె రోడ్డు
రాత్రివేళ చీకటితో
నేతచీర కట్టుకున్న పల్లెపడుచులా
అమాయకంగా చూస్తుంది.
పట్నం రోడ్డు నాగరికురాలు.

మెర్క్యూరీ బల్బుల కాంతులతో
వచ్చియె రాకపోకలకు ఆకర్షణ.
పల్లెలలో గతుకుల రోడ్డులు
జనానికే భయం.
రాత్రివేళ నల్లని జుట్టు
విరబోసుకున్న దెయ్యంలా
మరింత భయాన్ని కలిగిస్తుంది.
సాఫీగా సాగిపోయే రోడ్డు
జనుల గమనానికి సౌకర్యం.
వాహనగమనానికి సులభం.
గతుకుల రోడ్డు
కష్టనష్టాలతో సాగిపోయే
జనుల జీవితంలా అందరికి భయంకరం
విశాలమైన రోడ్డు
విశాల హృదయునిలా
ఎన్నిగమనాలనైన నిలుపుకుంటుంది.
ఎన్నిటికైన చోటు నిస్తుంది.
ఇరుకు రోడ్డు పదిమందిని చూస్తే
ఉక్కిరిబిక్కిరై భయపడుతుంది.
చలిజ్వర పీడితునిలా వణుకుతుంది.

సమాజానికి జీవితాన్ని
అంకితంచేసే మహాత్మునిలా
మహాత్యాగి.
వర్షించే మేఘునిలా
పరోపకారి రోడ్డు.
పరులకోసం పుట్టి
పరులకోసం పెరిగి
పరులకోసం నిలిచేది
తాను నలిగి ముక్కలవుతున్నా
నోరు తెరవక నిలిచేది రోడ్డు.
అందుకే ఓర్మికి కొలమానం రోడ్డు.
ధనానికి తూగనిది
లంచానికి లొంగనిది
ఆటుపోటులను తట్టుకునేది రోడ్డు.
ప్రాతఃకాలంలో ఉదయబాల
మధ్యాహ్నవేళలో వయసు కన్య
సాయం సంధ్యలో యౌవ్వనవతి
రాత్రివేళలో వయసు మీరిన తల్లి.
ఉదయవేళలో హాయిగా
ఉపిరి పీల్చుకుని

సాయంకాలం ఉక్కిరి బిక్కిరి అవుతూ
చీకటి వేళలో విశ్రాంతి తీసుకుంటుంది.
ఒకరినొకరు తోసుకుంటూ
ముందు వెనుకలు చూడక
కంగారుగా సాగిపోయే జనాన్ని
వింతగా చూసె రోడ్డు
తాగినమైకంలో ఒళ్ళు తెలియక
వాహనాలు నడిపే ఆసామీలను
ఆశ్చర్యంగా చూసె రోడ్డు
ప్రమాదాలలో గాజుముక్కలు
రోడ్డునిండా పరుచుకున్నప్పుడు
జాలిపడే రోడ్డు
గాయాలతో, బాధపడే వారిని
అవయవాలు విరిగి బాధపడే వారిని
రక్తపు మడుగుల్లో జీవాలు కోలుపోయేవారిని
చూసినప్పుడు కన్నీరుకార్చే రోడ్డు
నిత్యం నేర్చుకునే అనుభవంతో
అన్ని పరీక్షలకు నిలబడే రోడ్డు
మంచికి గర్వపడక
చెడుకు ముడుచుకోని మహాత్మురాలు.

వర్షం పడితే దుమ్ము ధూళి నిదులుపుకుని
మంచుతో మిలమిల మెరిసే రోడ్డు
అన్ని గమనాలకు నిబ్బరంగా నిలబడుతుంది.
ఉదయం చల్లగా నిలిచేది
మిట్ట మధ్యాహ్నం వెడితే కాలుతూ
త్రాచులా బుస్సలు కొడుతూ
అమాయకులు కాలు పెడితే కాటువేస్తుంది.
చర్మాన్నే మాడ్చేస్తుంది.
చెప్పులు, బూట్లు తొడిగి
గడుసుగా సాగిపోయే వారిని చూసి
గర్వపడుతుంది.
మానవుల చేతుల్లో
ఊపిరిపోసుకునే రోడ్డుకు
మానవనైజం సహజం కదా!
జన, వాహన గమనాన్ని కాంక్షించేది
నిర్మానుష్యాన్ని నిరసించేది
సర్వగమనాలకు తోడు నిలిచేది
సర్వ గమనాలకు దీపంలా వెలిగేది రోడ్డు
చిన్న పెద్ద తేడాలు వున్నా
సన్నం లావు తేడాలు వున్నా రాజబాట రోడ్డు.

ఊరికి అందం రోడ్డు
ఊరి పేరు నిలబెట్టేది రోడ్డు
గుంటలు, గంతలు మోసం చేసినా
సరిదిద్దుకోడానికి ప్రయత్నించేది రోడ్డు.
పరోపకారానికి ప్రతీక
ఓర్మికి నిలయం రోడ్డు.
రాకపోకలు రోడ్డుకు అందం.
చెట్లు చల్లని నీడను ఇస్తే
లైట్లు చిక్కటి కాంతిని ఇస్తాయి.
తారు, సిమెంటులు జిలుగును అందిస్తే
సూర్య చంద్రులను చూస్తూ సాగిపోయేది రోడ్డు.
కాంట్రాక్టర్ల స్వార్థంతో మోసపోయి
మూడు నాళ్ళకే గతుకులు పడుతున్న
జనుల ప్రయత్నాలతో తిరిగి పూడుకునేది రోడ్డు.
త్రికాలాలో ఒక్కలా నిలిచేది
ఏళ్ళ తరబడి మనిషిని కొలిచేది
దేవతల్లా మృత్యువులేనిది
ఊళ్ళలో పెనవేసుకు బతికేది
ఒంటరి తనం కోరని నిస్వార్థమూర్తి రోడ్డు.

రోడ్డు అందరికి కావాలి
అందరూ కావాలి రోడ్డుకి.

ట్రాఫిక్‌ను బట్టి డిమాండు పెంచుకునేది
ఊరునుబట్టి ఎదిగిపోయేది
ఊరు పేరు నిలబెట్టేది రోడ్డు.
రోడ్డులేనిదే మనిషికి గమనం లేదు.
రోడ్డు చెడితే కాళ్ళకు సంకెళ్ళు
రోడ్డు క్షేమం అందరికి క్షేమం.
అందరిక్షేమం రోడ్డు క్షేమం.
దేశ నాగరికతకు చిహ్నం రోడ్డు.
దేశ గమనానికి కరదీపం రోడ్డు
మానవ గమనానికి మార్గదర్శి రోడ్డు.



11-11-90

# అక్షర దీపాలు

అడుగడుగున పేర్చండి
అక్షర దీపాలు
అందివ్వండి కలకాలం నిలిచే
కవితల కాంతి పుంజాలు.
అదృశ్యం కావాలి అంతులేని
అజ్ఞాన అమావాస్య చీకటులు
పొడుకోవాలి దుష్టశక్తులు కదల్చలేని
విజ్ఞాన వినూత్న చైతన్య పథం.

ఎనభై కోట్ల జనాభా గుండెల్లో
వెల్లివిరిసిన ఆలోచనలూ
పొంగిపొరలె ఆశయాలూ
భిన్న భిన్నాలై ప్రజ్వరిల్లితే
సాగె అడుగులకె ఆటంకాలు
వెలిగే బాటలకే అవరోధాలు.
అందరి ఆశయం ఒక్కటై సాగితే
దేశ సమైక్యతకే వేయవా పూల బాటలూ !

మనచుట్టూ ఎన్నో జీవనదులు
జన్మస్థలాలు వేరైనా
ప్రవహించే బాటలు వేరైనా
అందించే మంచినీరు ఒక్కటే
పెంచె పైరు పంటలు ఒక్కటే !

మన మధ్యలో ఎన్ని మతాలు
ఎన్ని రకాల పూజలు ప్రార్థనలూ !
రాముడు, రహీము, ఏసు
రూపాలె భిన్నాలు
ప్రబోధించె గీత ఒక్కటే !
అన్నిట అంతరార్థం ఒక్కటే !

ఆరువది నాలుగు రాష్ట్రాల నిలయం ఈ దేశం
ప్రజాపాలనకై ఎన్ని తంత్రాలు
మొలకెత్తే కుతంత్రాలకు
ఎన్ని సవరణలు
అన్నీ సమైక్యతా భారతావని
మెడలో పూలహారాలై కదా!

మన చుట్టూ ఎన్ని భాషలు
ఆర్య, ద్రావిడ, భాషా భేదాలు
లిపిలో తేడాలె కాని
అందించె మాధుర్యంలో
తెలిపె విజ్ఞానంలో విభేదమెక్కడ?
అన్ని భావాలు మల్లెపూదొంతరులు
ఇచ్చి పుచ్చుకునే పూచెండులు.

దేశం నలు చెరగులా
వినూత్న విజ్ఞాన వీచికలు
సుమధుర సుందర పరిమళాల విందులు.
రసజ్ఞులకు హృదయానందాలు.
విజ్ఞానులకు జ్ఞాన చంద్రికలు.

ఎందరు మహానుభావులకు
త్యాగ ధనులకు ఆలయం
ఈ సువిశాల భారతం.
అందరి హృదయం ఒక ఆలయమై
అందరి భావం సుందరతరమై
కదలాలి ముందుకు
నిలపాలి దేశ గౌరవం.

త్యాగమూర్తియై నిలువగా
ఆంధ్ర కేసరి ఆశయం పండగా
ఆంధ్రులంతా ఒక్కటై నిలువగా
మహాంధ్ర అవతరించిన
నవంబరు ఫస్టు నేడు.

త్యాగ మూర్తి పొట్టి శ్రీరాములు
దీక్షా మూర్తియై నిలువగా
గలగల గోదావరిలో తెలుగు నాట్యం.
కృష్ణవేణమ్మ జడలో
తెలుగు సుడికారం.
తెలుగు తల్లి మెడలో
తెలుగు కవితల పూలహారం.
తెలుగు నేలలో పులకరించే సుమ సౌరభ్యం.

ఆంధ్రులారా! దేశభక్తి పొంగి పొరలగా
సమైక్యతా భావం వెల్లివిరియగా
మానవత్వం సుమసౌరభమై
దేశమంత పరిమళించగా
అడుగడుగున పేర్చండి
అక్షర దీపాలు.
అందించండి అందరికి
అంతులేని కాంతి పుంజాలు.



1-11-90

# త్రివర్ణ పతాకం

ఎగురుతోంది త్రివర్ణ పతాకం

త్రివర్ణ భేదాలతో

సంకుచితమైపోయిన మనస్సులలో

పెంచుకున్న దౌర్జన్యాలతో

ఆకాశం నిండా కమ్ముకున్న

కన్నీటి మబ్బుల కదలిలో

వణికించే చలిని విసురుకుంటూ

ఎగురుతోంది త్రివర్ణ పతాకం.

విశాల భారతంలో
స్వేచ్ఛ నిలబడ లేనెదు నేలలేక
పడగ విప్పిన దౌర్జన్యం నీడలో
చెమటలు కారుస్తూ విలపిస్తుంటే
స్వేచ్ఛకు ఊపిరి అందివ్వాలని
స్వేచ్ఛా గగనంలో ఎగురుతోంది
స్వేచ్ఛగా త్రివర్ణ పతాకం.

మానవత్వం విరిగిన కొమ్మలా
నేలకు వంగుతుంటె
దానవత్వం తాటి చెట్టులా
రోజు రోజుకి పెరిగిపోతుంటే
ఈ నేలపై శాంతిని వెలకొల్పాలని
శాంతికపోతమై ఎగురుతోంది
మన త్రివర్ణ పతాకం.

పూటకి గుడ్డకు కరువై
జల్లెడ అడుగున మిగిలిన నూకల్లా
విలువలేని జీవాత్మై కొందరు
మసక మసక వెలుతురుతో జీవిస్తుంటే
అహం పెంచుకున్న ఆసాములు

మీసాలు దువ్వుకుంటూ
రోషాలు పెంచుకుంటూ
నరకాసురులై స్వైరవిహారం చేస్తుంటే
దురంహంకారుల దుమ్ము దులిపి
జనులను కాపాడాలని
ఆకాశంలో రెపరెపలాడుతూ
ఎగురుతోంది త్రివర్ణపతాకం.

చుండూరులో జరిగిన మారణకాండకు
రక్తం ఏరులై పారితే
పంజాబులోని మారణ హోమానికి
రక్తం పంచ నదులై పారుతుంటే
కాశ్మీరులో చెలరేగిన దౌర్జన్యానికి
అందమైన వాగులన్నీ
రక్త సిక్తాలై పారుతుంటే
నెత్తుటి గుడ్డలా ఎగురుతోంది
మన త్రివర్ణ పతాకం.

భారత జాతికి ఊపిరి త్రివర్ణ పతాకం.
స్వేచ్ఛా భారతానికి నెలవంక త్రివర్ణ పతాకం.
భరత దేశానికి దీక్షాకంకణం త్రివర్ణ పతాకం.

అందుకే వల్బనై పోతున్న
జనుల ఉత్సాహాన్ని పట్టి ఆపాలని
పరిసరాలను బాధ్యతలను మరచి
నిద్రపోతున్న జనాన్ని లేపాలని
నేటి చైతన్యానికి ఊపిరిపోసి
రేపటి పౌరులకు కరదీపమై
అందించి కలకాలం నిలపాలని
శాంతి అహింసలను ఈ ధరిత్రిపై కాపాడా
విజయ కేతనమై
స్వేచ్ఛా భారతంలో ఎగురుతోంది.
ఎదురులేని మన త్రివర్ణపతాకం.



25-1-91

# చిరునవ్వు

చంద్రుని వెన్నెలకన్న చల్లదనిది చిరునవ్వు
సూర్య కిరణముకన్న చల్లనిది చిరునవ్వు.
స్నేహానికి ప్రేమకు, ఆత్మీయతకు
ఎగురవేసిన జెండా చిరునవ్వు.

ఆరోగ్యానికి ఆనందానికి
పసిడి తోరణం చిరునవ్వు.
పొలుకారె పసిబుగ్గల చిరునవ్వు
మమతానురాగాలు పొంగె పాలకడలి.

బాల భాస్కరునిలా పెరిగె
యువత చిరునవ్వు
కండ బలాన్ని గుండె బలాన్ని పెంచె
వీర శంఖారావం.
వయసు మళ్ళిన వారి చిరునవ్వు.
కోటి అనుభవాలకు నిలువుటద్దం
ఉన్నవారికి లేనివారికి
భేదాలు తెలియని
సమైక్యతా పుష్ప పరిమళం చిరునవ్వు.
అరవిచ్చిన పెదవుల మధ్యలో
తెల్లని మల్లెల సౌరభం చిరునవ్వు.
కొందరి చిరునవ్వు
క్రోధం వడగలో గ్రీష్మమై
బుసలుకొడుతుంది.
కొందరి చిరునవ్వు
ధన దాహంతో
పదవీ వ్యామోహంతో
నల్లని ముసుగు వేసుకుని
పొగలు కమ్ముతుంది.

కొందరి చిరునవ్వు
అనారోగ్యపు పొరల్లో
ఇరుక్కుని నీరసంగా
నిర్వికారంగా మూల్గుతుంది.
కొందరి చిరునవ్వు
పరిసరాలను మరిచి
బద్ధకం ఒడిలో గురక పెడుతూ
బీభత్సం సృష్టిస్తుంది.
చిరునవ్వు చిందించేవారె
ఆరోగ్యవంతులు.
చిరునవ్వుల విలువలు
కొలుచుకున్న వారె అదృష్టవంతులు
చిరునవ్వు సందేశం
అర్థం చేసుకున్నవారె
అసలైన విజ్ఞానవంతులు.
తిండి బలం లేనిదే
కండబలం ఎక్కడిది ?
అందమైన చిరునవ్వులు ఎక్కడివి ?

ఆధునికత పేరుతో
తిండిమాని ఎండిపోతే
చిరునవ్వుకు బదులు
చికాకు పొడుచుకొస్తుంది.
ఈనుపుల్లవై మనుష్యులుంటె
దేశానికి ప్రగతి ఎక్కడిది?
ఖరీదైన వస్త్రాలు కట్టుకుంటె
అందము పెరగవచ్చును కాని
ఆరోగ్యం చేకూరదు కదా!
ఆరోగ్యము లేనిదే
ముఖంలో చిరునవ్వులు
మూలపడి ముడుచుకుపోతాయి.
ఇంటినిండా సామానులు పరుచుకుంటె
దొంగల బాధతో
నిద్రకు దూరమవుతారు
అనారోగ్యానికి దగ్గరవుతారు.
శరీరానికి కావాలి ఆటలు పాట!
వ్యాయామాలు - నియమాలూ.
వేళకు తగిన పోషక పదార్థాలు.

తిని కూర్చుంటె శరీరం
బరువెక్కుతుంది కాని
ఆరోగ్యం అంగుళమైన పెరగదు.
అర్థం భావం తెలీకుండా
గ్రంథాలు చదివితే
చత్వారం పెరుగుతుంది కాని
విజ్ఞానం పెరుగుతుందా?
కనపడినదల్లా కడుపులో పడవేస్తే
బొజ్జ పెరుగుతుంది కాని
ఆరోగ్యం ఇసుమంతైన ఎదుగుతుందా?
వడ్డీలకు వడ్డీలు కట్టి
డబ్బు పెంచితే
దొంగల బెడద పెరుగుతుంది కాని
ఆరోగ్యం పెసరగింజంతైన పెరిగి
రెమ్మలు కొమ్మలు తొడగదుకదా!
మూఢాచారాలను అందల మెక్కించి
అసలు ఆచారాలు కాళ్ళరాసి
బూడిద పాలుచేస్తే
శరీర పటుత్వం తగ్గుతుందికాని

అందం బందాలు పడదుకదా!

రోజు రోజుకు శాస్త్రజ్ఞానం
పెరిగి పెద్దదవుతోంది.
పిశాచులవంటి రోగాలనె
మాడ్చి మసిచేస్తోంది.
గుండెలను మార్చి గుండెలు
అతికి ప్రాణాలు పోస్తోంది.
మెదడు శేశస్త్రచికిత్సలు చేసి
పలికింపచేస్తోంది.
అన్ని సదుపాయాలు
తెసుకున్న వారె నాగరికులు.
అందుకున్న వారె నాగరికులు.
నూరికాలంతో కలిసి
అడుగులు వేసి నడచేవారె
అసలు నాగరికులు.
పెరుగుతున్న విజ్ఞానంతో
మనసులు పెంచుకున్నవారే
విజ్ఞానవంతులు
పెరిగినవారే వివేకవంతులు

మూర్ధనమ్మకాలతో
భయబడి వెనుకకు అడుగువేసి
కాకూడదు భూతానికి బలి
కదిలే కాలంతో కాలువేసి
వర్తమానం చేపట్టి
భవిష్యత్తు వెలుగులవైపు కదలాలి.
ఆరోగ్యమె మహాభాగ్యమని తలచి
చిరునవ్వులు వెలిగించాలి.
అవే లోకానికి కోటి దీపాలై
కాంతులు వెదజల్లాలి

15-2-91

—o— —o—

# కొత్త కాంతి సంక్రాంతి

పట్టాల వెంట పరుగెత్తే రైళ్ళలా

కష్ట సుఖాలను మోసుకుంటూ

కాలంవెంట పరుగెత్తే ఋతువులు.

ఋతువుల వాకిట్లో వెలిగే

పండుగ పూ గుత్తులు.

జనుల ఆనందపు డోలికలలో

ఊగె పల్లె, పట్టణాలు

పచ్చని తోరణాలతో వెలిగే వాకిళ్ళు.

హేమంతపు చల్లని తెరలలో
దోబూచులాడె సంక్రాంతి
తెలుగింటికి కొత్త కాంతి.

ఏనాడో జరిగిన రాక్షస మథనానికి
మ్రోగించె విజయ దుందుభి అది.
దానవత్వాన్ని మట్టుపెట్టి
మానవత్వపు వెలుగు వెంట
మానవులు నడిచే శుభ సమయమది.

ఆనాడు ఒక్కడే రాక్షసుడు.
మరి ఈనాడు?
ముంగిట పేర్చిన ముగ్గుల రేఖలే
అతివలకు లక్ష్మణ రేఖలు.
అవి దాటితే ఎందరో కపట రాక్షసులు.
జాడ తెలిపే జటాయువులు
తోడు నిలిచే సుగ్రీవులు.
జాంబవంతులు, హనుమంతులు
మాత్రం కరువయ్యారు.
శూర్పణఖలు, చుప్పనాతులు
హరసత్వాలు నిలుపుకుంటున్నారు.

ఎన్ని చట్టాలు వచ్చినా ఏమి లాభం?
వరకట్నం జుట్టుపట్టి బుద్ధిచెప్పే
అసలు చట్టమే లేదు?
వధువులుకార్చే కన్నీటి ఆవిరితో
ఆకాశంలో మేఘరాసులు పేరుకుంటున్నాయి.

వధువులు కాలేమంటలతో
వంటిళ్ళు చిటపట మంటున్నాయి.
కన్యల మనసులు ధగధగ మంటున్నాయి
తల్లి తండ్రుల కడుపు మంటలతో
బుగ బుగ మంటున్నాయి వాడ వాడలు.

భోగి మంటలకు బదులు
నగర వీధుల్లో డెకాయిట్ల ఆగడాలు.
క్రూరుల దానవ చేష్టలతో
సరిహద్దుల్లో శవదహనాలు.
బస్సుల దారి దోపిడీలు
రైలు పెట్టెల కాల్పులు
పెట పెట మంటున్నాయి.
జనుల హా హా కారాలు
ప్రజల హృదయాలను పిండేస్తున్నాయి.

బంధువుల కన్నీళ్ళు
బూడిదతో కలిసి
బురదగా మిగులుతున్నాయి.

మనుష్యులే పొట్టేళ్ళు
కోడిపుంజులై మంచి చెడులు వదలి
నడిరోడ్డులో కుమ్ముకుంటూ
పొడుచుకుంటూ, తన్నుకుంటూ
కుత్తుకలుత్తరించుకుంటున్నారు.
గోదావరి, కృష్ణా జీవనదులతో పాటు
తెలుగు నేలతో పారుతుంది
మరో రక్తపు టేరు.

చిడుతలు, తంబురాలు
చేతపట్టి పాటలు పాడుతూ
తిరిగే కళాకారులకు
మంచిరోజులు కావివి.
ఫైళ్ళ వెంట చేతులు చాచి
నడిచే సైతానుల రోజులివి.
ఇల్లు గుల్ల అయ్యేవరకు
వదలని జలగరు వీరు.

మోసకాళ్ళు, వేషగాళ్ళు
షోకుగా బ్రతికే రోజులివి.

దక్షిణాయనం నుంచి
ఉత్తరాయణానికి
సూర్య గమనం మారుతున్నా
గమనం మార్చుకొని
గడుగ్గాయిలు వీరు.
మంచి, చెడులను తారుమారుచేసి
చీకటి బజారువెంట
పరుగెత్తించే రోజులివి.

అయినా పండు సంబరాన్ని
వెంట పెట్టుకుని పరుగు పరుగున
వస్తోంది సంక్రాంతి.
కాలం పడగెత్తి కస్సు బుస్సుమంటున్నా
వణికించే చలిలో
గుండె మంటలు రగులుతున్నా
ఇంటింటా పచ్చని తోరణాలు పరుచుకుంటూ
మానవహృదయాలలో దాగున్న
మనో వ్యాధులు తరుముకుంటూ

పరుగు పరుగున వస్తోంది సంక్రాంతి.
అక్కడ దక్కడ మిగిలిన
మాన వత్వపు శకలాలను
ఏరి తెచ్చి భోగి మంటలు వెయ్యాలని
పేరుకునే శోకపు మబ్బు తెరలను
పటా పంచలము చేసి
తెలుగు ప్రజలకు వెచ్చనిశాలువాలు కప్పి
శాంతి భద్రతలు అంది వ్వాలని
కాంతి పుంజమై కదలివస్తోంది
తెలుగింటి కొత్తకాంతి. సంక్రాంతి.

— o — — o —

6-1-92

# ఆకాశం

మనిషి హృదయానికి కొలమానం ఆకాశం,

ఆకాశానికి కొల మానం మనిషి హృదయం.

శూన్య హృదయంలో సుందరభావదృశ్యాలు ఎన్నో !

శూన్యా కాశంలో సుందరగ్రహ దృశ్యాలు ఎన్నో !

వెలుగులు చిమ్ముకుంటు పయనించే సూర్యుడు

వెన్నెల కురిపిస్తూ సాగె చంద్రుడు

మిల మిల మెరిసే నక్షత్రాలు

ఆకాశాన్ని నిత్యంకొల్చిచే మంచిస్నేహితులు,

మేఘ మాలికలతో రంగులు మార్చుకునే ఆకాశం
ఉరుములతో మెరుపులతో
ప్రళయ గర్జనలు చేస్తుంది
సముద్ర గాంభీర్యంతో పోటీలు పడుతుంది.

ఏడురంగులు ఇంద్రధనస్సుతో
విలాసవతి గగనం,
పసి పావలాచూసె భూమికి
అందమైన పాలవెల్లి ఆకాశం.

వర్షించి భూమిని తడిపేశక్తి
వెలుగులు గుప్పించి భూమిని మేలుకొలిపే శక్తి
చీకటి రాసులతో భూమిని జోకొట్టే శక్తి
ఒక్క ఆకాశానికే ఉంది.
అజ్ఞాన, విజ్ఞాన, శాస్త్రజ్ఞానాలకు
ఆలయం ఆకాశం.

మానవునకు పూర్తిగా అంతు పట్టనిది
మానవ మేధస్సుకు మేత వేసేది
మానవ ప్రయత్నానికి చేయూతనిచ్చేది ఆకాశం.
మానవ హస్తం తాకనిది ఆకాశం.

అందుకే మనుష్యులవలె
సంకుచితమై ముడుచుకోనిది
ఎల్ల వేళలా విప్పిన గొడుగువలె
నిలిచేది
హద్దు గోడలు నిర్మించుకోనిది
సరిహద్దులు పేర్చుకోనిది
నామ కరణంచేసుకోనిది ఆకాశం,
విధ్వంస కాండలు, రక్త పాతాలు
తెలియని పవిత్ర మూర్తి ఆకాశం,
ఎవరి హద్దుల్లోను నిలువనిది
ఎవరి ఆంక్షలతోను బ్రతకనిది ఆకాశం.
అందుకే స్వేచ్ఛకు ప్రతీక ఆకాశం.
విశాలత్వానికి ప్రతీక ఆకాశం.

— ౦ — — ౦ —

10-2-92

# నడక

మనిషికి నడక చైతన్యం.

నడక నాగరికతా లక్షణం.

నడక నేర్వక మట్టి ముద్దలా

పడున్నవాని మనసు

నాపరాయిలా మొద్దుబారిపోతుంది.

ప్రగతి మార్గం తెలియక

వెనుక మార్గం పడుతుంది.

వెలుగు బాటలు మూసుకుంటూ

చీకటి తెరలను చుట్టుకుంటుంది,

నడక నాగరికతా లక్షణం

నడక ముందడుగు,

పశు పక్ష్యాదులకు

నడక తెలుసు.

కాళ్ళులేని క్రిమికీటకాదులకు

నడక తెలుసు.

నడకంటె చలనం.

చలనం లేని వస్తువుకు

చెదలు పడతాయి.

నడకంటె నడవడం కాదు.

నడకంటె ఊపిరి సలపక

పరుగెత్తడం కాదు.

నడకంటె అడుగుతీసి

అడుగువెయ్యటం కాదు.

నడకంటె నదీ ప్రవాహం.

నడక నేర్చిన కొత్తనీరు

పాత నీటిని తోసుకుంటూ

ముందుకు సాగిపోతుంది.

అడ్డువచ్చే అడవులను పెల్లగిస్తూ
అడుపుచేసే గట్లను ముంచుకుంటూ
నది ఉత్సాహంగా ముందుకు సాగిపోతుంది.
అందుకే ఉత్సాహానికి ఊపిరినదక.

నిరుత్సాహ వంతుడు కాలుండి కదలలేడు.
సాగె కాలును ముడిచి పడుకున్నవాడు
ఎందుకూ కొరగాని వాడు.
కాలుండి కదలని వాడు
పరమ లోభి.
నడిచే కాలున్నదని తెలియని వాడు
లోకజ్ఞానం తెలియని వాడు.
చిన్నతనంలో తప్పటడుగులు
మనిషికి అందం.
చూసేవారికి ఆనందం.
వయసు వచ్చినవారి తప్పటడుగులు
జీవిత గమనానికి చేటు.
మాటకు నిధానం
నడకకు నిధానం ప్రధానం.

చురుకైన నడక మనిషి
జీవితానికి పూలబాట.
మందకొడిగా సాగె నడక
భవిష్యత్తుకు గొడ్డలి పెట్టు
ఎదిగే కాలుకు నడక అందం.
నడక మనిషికి ఆరోహణం.
మనిషికి జీవనాధారం నడక
మనిషి జీవితానికి ప్రధానం నడక.
రెండు కాళ్ళే కాదు
రెండు కళ్ళుండాలి నడకకు.
కళ్ళేకాదు నడకకు మనసుండాలి.
నల్లేరుపై నడక కాకూడదు
మనిషి జీవితం.
రాచబాటలో సాగే నడక కావాలి
మనిషి జీవితం.
మనిషికి నడక చైతన్యం.



15-8-92

# స్వేచ్ఛా భారతి

నలుబదియైదు వసంతాలు పైబడినా
తప్పటడుగులు వేయిస్తూ స్వతంత్రభారతాన్ని
పసిపాపలా జోకొట్టాలని కలలుకనే
నయవంచకుల కబంధ హస్తాలమండి
స్వార్థపరుల ఇనుపగు ప్పెళ్ళనుండి
దేశ ద్రోహాల కుట్రలనుండి కాపాడాలి.

జనులందరు ఏకమై నడుం కట్టాలి.
స్వతంత్ర భారత వీరులై ముందుకు నడవాలి.

ఎన్నికల పేరుతో ఆదర్శాలు అప్పచెబుతూ
ధనదాహంతో ప్రథాళికలు పేరుస్తూ
ఆస్తులు అంతస్తులు పెంచుకుంటూ
అమాయకులను మోసం చేసే
ఆసామీల ఆటలకు కట్టాలి ఆనకట్టలు
జనులందరు ఏకమై నిలిచి
దేశమాత గౌరవం నిలబెట్టాలి.

పదవీ వ్యామోహాలతో అంధులై
మంచిచెడులకు దూరులై
మానభంగాలకు! అత్యాచారాలకు దగ్గరై
జనులను భయభ్రాంతులు చేసి
నిర్జీవులుగ మార్చే రాక్షసాధములు
వికృత చేష్టలకు వేయాలి గట్టులు
జనులందరు బద్ధ కంకణులై
దేశమాతను సంరక్షించాలి.

నీజాయితీని మంటకలిపి
దీనుల కడుపులు కొట్టి
ఆకలి మంటలకు ఆహుతి చేసే

దుర్మదాంధులమందగాలకు
స్వస్తి చెప్పే రోజులు రావాలి
జనులందరు ఐక్యమత్యంతో కదలాలి.

కులమత భేదాల కుంపట్లు రగిలిస్తూ
రక్తపాతాలు సృష్టిస్తూ
దేశాన్ని ముక్కలుచేసి వినోదించాలనే
దేశద్రోహుల కుట్రలకు చెప్పాలి బుద్ధి
జనప్రవాహం వెల్లువై సాగాలి
శాంతి స్నేహాలతో స్వతంత్ర భారతం వెలగాలి.

— ౦ — — ౦ —

20-8-92

# అసలు వెలుగు

స్వార్థం కర్ణ రంధ్రాలకు తాళాలు వేస్తుంటే
అన్నార్తుల ఆక్రందనలు
ఎవరి కర్ణాలకు తాకి
హృదయాలను తట్టి లేపుతాయి?
వారి పేరు మాటి మాటికి చెప్పుకుంటూ
మర్రి చెట్టులా పెరిగి
వేళ్ళు, ఊడలు పెంచుకునే వారెగాని
వారికి పట్టెడన్నం పెట్టె దెవారు?

అయినా ఒక రోజు గుప్పెడన్నం విదిలిస్తే
రగిలే ఆకలి చిచ్చు చల్లారి పోతుందా?
తర తరాలనుండి మాడి పోతున్న
ఆకలి పేగులవి!
ఆకలి వ్యక్తికి. దేశానికేకాదు
ప్రపంచానికి సంబంధించిన సమస్య!
అయుధాలతో అణు బాంబులతో
ఆడుకునే వారికి ఆకలిబాధ తెలుస్తుందా?
గుండెలో పెరిగే సంస్కారపు వృక్షం ఎండిపోతే.
పేగుల్లో కదిలె మానవతా సరస్సు ఎండి పోతే.
జలం నింపి పూరించే దేవారు!
అందరు అడ్డదారుల వెంటే
పరిగెత్తు తున్నప్పుడు!
జీవన విధానం నేర్పే శిక్షణాలయం
ఈ సమాజమే అయినా
సమాజమే సరిలేనప్పుడు
మహాత్ములు పుట్టినా
గుర్తించి ఆదరించే దేవరు?

గాడ్సేలదే రోజులయి నప్పుడు
అన్నార్తుల ఆక్రందనలు తీరెదెట్లు ?

రెండు కళ్ళూ ఆకాశ మంత విశాలంగావున్నా
హరిణాక్షులంత అందంగావున్నా
పై చూపు లేకాని
కింద, పక్క చూపులు లేనప్పుడు
అక్రమాలకు బలి అవుతున్నవారి.
రోదనలు, వేదనలు
విన బడేదెట్లు ?
చూపుకు చుక్కాని మనసైనప్పుడు
మనసుకు మమతాను రాగాలు లేనప్పుడు
ముఖానికి రంగులద్దినట్లు
మనసుకు అలంకారాలు అద్దేదెవారు?
నటనా జీవితాలకు
పదవులు అలంకారాలు.
సేవా కార్యక్రమాలకు జాప్యం
మోసం తప్పని శిక్షలు,
అన్యాయాలు. అక్రమాలు కనబడవు వారికి.

అహంకారంతో గుండె గదులు మూయబడితే

అమాయకుల ముల్లులు పెడబొబ్బలు

గుండెల్లో గుచ్చుకునేదెట్లు?

నల్లరాయి వంటి మనసులు కరిగేదెట్లు?

నాలుగు గోడల మధ్యలో

స్త్రీలు పడే బధాలు అవమానాలు

వారితోనె సమాధికావలసిన దేనా?

మనిషి బతుకుంతగా సాధింపలేనిది

బూడిదయిన తరువాత

కోర్టులు, కేసులు, వాదనలు

మనిషిని బతికింప లేవు!

మనిషి పడిన బాధలు తప్పింపలేరు?

దేశానికి స్వరాజ్యం వచ్చినా

మనిషికి స్వతంత్రం ఇంకారావేదు.

సంకుచితాల వలయంలో

స్వార్థపు పడగలో నిద్రపోతున్న మనిషిని

లేపడానికి ఏ సూర్య హస్తాలు పనికిరావు?

ఏ భయంకర వాయు తరంగాలు పనికిరావు?

మనిషిలో స్వార్థం కడిగెయ్యాలంటె
వరద ప్రవాహం వంటి జనం కావాలి?
మనిషి కళ్ళు తెరిపించాలంటె
కణ కణమండె నిప్పుకణాల వంటి జనం కావాలి?
జనం మేల్కొవాలి!
జనాన్ని మేల్కొలపాలి?
ఆక్రందనలు, రోదనలు, వేదనలు నశించి
జనానికి వెలుగు వస్తుంది.
అదే లోకానికి అసలు వెగులు,

— o — — o —

15.4.92

# జీవనరాగం

అచంచల దేషాశక్తి మానవునశక్తి పరిమితం.

కార్య సాధనా ప్రయత్నం మానవునిదే!

నవరసాలను ఉత్తేజపరిచేశక్తి

ప్రపంచాన్ని బంతిలా తిప్పేశక్తి

కార్య సాఫల్యాన్ని పొందే శక్తిమానవునిదే

సర్వ కళాకు శలుడు మానవుడు.

ప్రకృతి కావ్యంలో నాయకుడు మనిషి.

కలలు కంటూ బ్రతికేవాడు
కల్లమాటలు నమ్మేవాడు
జారవిడుచుకుంటాడు అద్భుతశక్తిని.

మానవ మేధస్సుకు ప్రయత్నం ఊపిరి.
ప్రయత్నానికి ఉత్సాహం ఊపిరి.
ఊపిరిలేని ప్రయత్నం ఆరంభశూరత్వం.
ప్రయత్నంలేని మేధస్సు
జడపదార్థమై పోతుంది.
సూదిపోట్లు తగిలినప్పుడే
మేధస్సు వికసిస్తుంది.

మానవుడు ప్రయత్నిస్తే
నింగి నేల కలుపగలడు.
ప్రయత్నాన్ని కాలిచుట్టుకు
పయనించేవానికి
ఘీంకరించే ఏనుగులు
గర్జించే సింహాలు తలలువంచుతాయి.
ప్రయత్నించి సాఫల్యం పొందిన వాడు
లోకంలో అజరామరుడు

ప్రయత్నాన్ని మధ్యలో ఆపేవాడు
వ్యర్థ ప్రయత్నం చేసేవాడు
కార్య విహీనుడు,
అసలు ప్రయత్నమే చెయ్యనివాడు
జీవిత సత్యాన్ని తెలుసుకోలేనివాడు.
ప్రయత్నించి సాధించిన వాడెమనిషి.
కోరికను నిలబెట్టేది ప్రయత్నం
ప్రయత్నాన్ని రేకెత్తించేది కోరిక.
మనిషికి ఎన్నో కోరికలు.
తగిన కోరిక జీవితాన్ని నిలబెట్టుతుంది
తగని కోరిక మనిషిని పతనం చేస్తుంది.
దురాశ అవుతుంది.
దురాశ మనిషిని కాల్చేస్తుంది.
ఆశ ఆశయం మనిషికి అవసరం.
ఆశయమే జీవనరాగం మనిషికి.

# అక్షరాయుధం

లోకం ఒడినిండా అలముకున్న
అజ్ఞానాంధ కారాన్ని
తరిమి తరిమి కొట్టాలని
సిసింద్రీలవంటి అక్షరాలను పేర్చే
అక్షర శిల్పి మహాకవి.

కాలం వీపుమీద పడుతున్న
అనాగరికతా విషపుకాట్లను
కనపడకుండ తుడిచెయ్యాలని
విజ్ఞానాన్ని ప్రయోగించె అక్షరాయుధం కవిత్వం.
కవిశాశ్వతం కాలంపుటలమీద.
కవితశాశ్వతం మానవహృదయ ఫలకంమీద.

# కాలం లేఖిని

మానవుని విచిత్ర

జీవన యాత్రలోని మంచిచెడులను

చరిత్ర చీరమడతల అంచులపై

చెరగని రంగులతో

చిత్రాలుగ చిత్రిస్తూ

తెలివైన కాలం

తేలికగా తప్పించుకు పోతుంది.

అంతర్గత ద్వారాల కౌగిట్లో

కాలం పదును తెలియక
కులుకుతున్న మనిషి
తన అధికారం చవిచూపాలని
చరిత్ర చీరమతతలపై
తన చరిత్ర తానె
అందంగా చిత్రించుకొని
ఆడంబరంగా నిలుపుకొని
ఆనందించాలను కుంటాడు.
కాలాన్నె మాయచేసి
కాలరాయ యత్నిస్తాడు.
కాని కాలం తేఖిని కళ్ళకు చాటుకాలేక
తానె కళ్ళు మూసుకుని
కాలధర్మం చెందుతాడు.

o — o o — o

# మనిషి - దేశం

దేశానికి దేహం మట్టినేల

దేశానికి ప్రాణం మనిషి.

మనిషి తీర్చిదిద్దిన మట్టినేల దేశం.

మనిషి సాధించిన విజయం

దేశానికి సరిహద్దు.

దేశానికి బలం జనం.

జనానికి బలం దేశం.

మనిషి నేల కలిస్తే దేశం.

మనిషి నేల సమపాలైతే
మనిషి దేశం సుభిక్షం.

పరుచుకున్న పచ్చని నేల
కొలిచే నీలి ఆకాశం
వెలుగు నిచ్చే సూర్యచంద్రులు
ఘోషించే సంద్రం
వర్షించే మేఘం
ఆవరించె అరణ్యం
పారె నదీ నదాలు
సేవించే పర్వతాలు
పెరిగే జీవరాసులు
తీర్చిదిద్దే మనిషి
దేశానికి అంగాలు.
దేశానికి మనిషి ఒక అంగమే అయినా
అంగాలను అమర్చి పాలించె
యంత్రాంగం మనిషి.
మనిషి ఏర్పరిచిన చట్టాలు
స్వతంత్ర దేశానికి కొలమానాలు

మనిషి పఠించే సూత్రాలు
లిఖించే రేఖలు
స్వతంత్ర దేశానికి వెలుగుబాటలు.

మానవ రాక్షస క్రీడావినోదానికి
సంకెళ్ళు దేశం.
మానవ విస్రృంఖల దానవ విహారానికి
పగ్గం దేశం.

మనిషి స్వేచ్ఛా జీవన మార్గానికి
రాజ బాట దేశం.
మనిషి నేర్చే నాగరికతకు
నేర్పే సంస్కారానికి బడిదేశం,
మనిషివె వెలిగే విజ్ఞానానికి
పరిమళించే మానవత్వానికి గుడిదేశం.

దేశం అలజడుల అగ్నిలో
ఆహాకారాలు చేస్తుంటే
చల్లార్చి దేశంలో శాంతిని
నెలగొల్పే శాంతి దూత మనిషి.
దేశాన్ని నడిపించే హస్తం మనిషి.

దేశానికి రక్షణ ఆయుధాలైన

ఆయుధాలకు రక్ష మనిషి.

మనిషి పెంచుకున్న శాస్త్రజ్ఞానం

దేశానికి వెన్నెల కిరీటం

దేశం పెంచుకున్న శాస్త్రజ్ఞానం

మనిషి జీవితానికి సౌకర్యం.

అందుకే దేశానికి వెలుగు మనిషి

మనిషికి వెలిగే దీపం దేశం.

   

# నాలుగు శతాబ్దాల చరిత్ర

నాలుగు శతాబ్దాల చరిత్రగల

నగరమిది.

ఇక్కడ వీచె గాలి కెరటానికి తెలుసు :

నాటినుంచి నేటికి పచ్చని పాన్పులా

పరుకున్న ఈ నేలకు తెలుసు.

నిత్యం నగరం మీదుగా నడిచిపోయే

ఆ సూర్య చంద్రులకు తెలుసు.

రాత్రివేళ చీకటి కౌగిలినుండి కాపాడె

నక్షత్ర జాలానికి తెలుసు।

నాలుగు శతాబ్దాల చరిత్రగల
నగర మిది.
మురికి కంపు తో ఎంది వదలిన
మూసీనది జీర్ణరూపం తెలుసునీకు.
చీకటికి ముందే ముసురుకునే
దోమల బెడద తెలుసు నీకు
నగర మనుష్యులవలెనే
సంకుచితమైపోయిన
ఇరుకు గతుకుల రోడ్ల
రూపం తెలుసు నీకు.
అమాయక ప్రాణాలను వేటాడిన
కర్కశ హృదయ ఘాతుకాలకు
పాత బస్తీ రోడ్లపై రాతిగోడలపై
మచ్చలుగా మిగిలిన
రక్తపు మరకలు తెలుసు నీకు
నిన్న మొన్న పుట్టిన
నీకు నాకు ఏమి తెలుసు?
నాలుగు శతాబ్దాల చరిత్రగల
నగరమిది.

గతం వర్తమానంతో కలిసి
భవిష్యత్తు వైపు పరుగులు పెడుతుంటె
గతంవైపు గడియలు పడిన
మనసును తెరచి
మూసుకు పోతున్న కంటి రెప్పలను
బలవంతంగా విప్పి
అంటి పెట్టుకున్న దుమ్మూ ధూళిని దులిపి
గతం మూటకు ముళ్ళు విప్పితే
కనబడతాయి మిగిలిన
నేటి శిథిలాలు
తెలుపుతాయి గత చరిత్రల
వైభవ అద్భుత నాదాలు.

భాగ్య నగరపు అక్షరాలను మీటితే
చూపుతాయి కళ్ళముందు ఋల్లితెరలో
భాగమతి ప్రేమగాధ
పట్టణ పుట్టుక విచిత్రకథ.

గోలుకొండ శిథిల కోటలను
ప్రీతితో పలుకరిస్తే
వినిపిస్తాయి తానీషా చరిత్ర

నవాబుల పాలనా వ్యవస్థ
అక్కన్నా, మాదన్నల మంత్రిత్వతంత్రం
చూపుతాయి రామదాసు బందిఖానా !
జీవిత విషాద రూపాలు
తరతలా నరజాతి అధికార వ్యామోహాలు,
అక్కడ ఏరాయిని పిలిచినా
తెలుపుతుంది నాటి కాళావైభవం
నేటికి జాలువారె ముత్యమంత సంప్రదాయం.

కుతుబ్‌షాహి టూంబుల గోడలను
అభిమానంతో అడిగితే
చెబుతాయి నాటిరాజుల కళాభిమానం.
నేటికి మిగిలిన కళావైభవం.
శరీరాలు అశాశ్వతమైనా
శశ్వతాలు కళాఖండాలని చూపుతాయి.

ఊహకు చిక్కేదే చరిత్రకాదు !
కంటికి కనబడేదే చరిత్రకాదు
గతించినది శిథిలం.
మిగిలినది సంప్రదాయం.

చరిత్ర జరిగిన దానికి చిత్రఫలకం,
యదార్థానికి ప్రతిరూపం.

నాలుగు చేతులెత్తి యెల్లవేళలా
నలుగుర్ని పిలిచే చార్మినార్
పాతబస్తీకి విజయ పతాకం
గతవైభవానికి శిఖరాయమానం
నేటి భరతావానికి తల మానికం.
రాముడు రహీముల సేవాతత్వం
దేశ సమైక్యతకు పూలహారం.

కలసివుంటె కలదు సుఖం
హిందూ ముస్లిం భాయీ! భాయీ!
నాలుగు శతాబ్దాల నగర వైభవానికి జై! జై!